# మున్నుడి

జీవితానంద సుమసౌరభము నాఘ్రాణించుటకు ప్రకృతిలో ప్రతి ప్రాణి ప్రయత్నించుచుండును. ఏతత్సాధనకు పలు వెతల ననుభవించి కార్యమును ఫలవంతముగా జేసుకొనును. జీవనరంగస్థలి సుఖదుఃఖాది వివిధ ఘట్టముల కాలవాలమైనది.

ఒక ప్రాణి జీవిత కాలమున ఒకానొక సందర్భమున సాధారణ జీవితము నుండి సమున్నత స్థాయికి, సమున్నత స్థాయి నుండి సాధారణ స్థాయికి మారుట సహజము. ఒక్కొక మారు ఈర్ష్యాసూయలు, రాగద్వేషములు, మానవుని పట్టుదల గలవానిగా జేసి పంతగింప జేసి, పరితపింప జేయును. పరితాపానంతర మాతని మనః ప్రవృత్తివినూత్న భావ సంచయ సమన్వితమై మహోన్నత స్థాన మాక్రమించి కార్యసాధనకు బూనుకొనును.

ఈ "తపోభంగం" అను చిన్న గ్రంథము మహా తపస్వియైన విశ్వామిత్ర మహర్షి తపస్సును మేనకాప్సర కన్య భంగ పరచు ఇతివృత్తముగలది. ఇందు సాధ్యమైనంత వరకు మాత్రాచ్ఛందస్సును పాటించితిని.

శ్రమకోర్చి ఈ గ్రంథ ప్రచురణకు బూనుకొనిన "బాపూ సేవా ఆశ్రమం" వారికిని, గ్రంథ ప్రచురణలో సహకరించిన మిత్రులు శ్రీ. కేసరి హనుమాన్‌గారికిని, త్వరలో ముద్రించి యిచ్చిన శ్రీ లక్ష్మి ఆర్ట్ ప్రెస్ వారికిని నా హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలుపుచు సహృదయ పాఠకలోకమునకీ గ్రంథము నందించు చున్నాను.

రచయిత.

# తపోభంగం

—: (1) :—

తరులతా పుష్పసుం
దర ప్రకృతి శోభలను
సంసారమును స్వర్గ
సౌఖ్యమ్ములను వీడి
దివి సభాసౌఖ్యసుం
దర కామినుల వీడి
నవయౌవనానంద
నాకమ్ము త్యజియించి
అప్సరోంగనల న
గ్నత్వ భావములందు
బందితులునై దివ్య
బంధనమ్మును దలచు
మునుల కాస్పదమైన
ఘన హిమాలయములవి,
భీకరారణ్య ఘో

రాకృతికి నిలయమ్ము
క్రూరాతి క్రూర జం
తువులకు న్నిలయమ్ము
ధర్మార్థ కామ మో
క్షమ్మునకు నీతికిని
హిమానీనదములకు
హిమరాశి కాకరము.
ఉత్తుంగ శిఖరాల
ఉద్వేగ్త్తు ధారలకు
వజ్రవై డూర్య ప్ర
వాళ మరకతములకు
నీలిమేఘాల సం
దెలతీవ పరిశక్తులకు
మత్త గజయూథముల
చిత్త చాంచల్యతకు
పచి కాచిన మగసిర
మోచిన్ని తరువులకు
పూచి రాలిన సుంద
రాకార సుమములకు
ఆలవాలమ్మైన

ఆహిమాలయ పంక్తి
అహిమాలయగిరులు

× ×

దివ్యయౌవన శోభ
లవ్యయమ్మగు తరులు
నవయౌవనాంగి పొడ
లావణ్యాంతర లతలు.
తరళ సుందర మధుర
తర మధువులెల్లెడల
గాన్పించు కనువారి
కన్నులకు నెల్లపుడు
మానవాభ్యుదయమున
మధుర స్వప్నము లెల్ల
కలిసి నేర్పడ్డయటు
కలిసె సర్వస్వమ్ము.
అట్టి పుణ్య చరిత్ర
దట్టమౌనాయడవి
అనఘాత్ముడైన వి
శ్వామిత్రుడచలుడై
బ్రహ్మర్షి భావమ్ము

బడయ గోరి తపమ్ము
గావించు చుండె సప
భావజాలము వెలయ
దివి నాథ దిక్పాల
త్రిదశు లెల్లరకన్న
ధర నిల్చినట్టి కొం
డల భీకరము కన్న
కాల మేఘాల గర్జ
నల రావము కన్న
శితికంఠు కంఠమున
నతిభయంకర రూపు
కల్గి చలియించు నా
గముభీషణము కన్న
వైకుంఠు కరదీప్తి
చక్రాయుధము కన్న
నీలకంఠుని హస్త
ములశూలమున కన్న
ముక్కంటి ఫాలనే
త్రకాంతికన్న నిల
అసమానమౌ బ్రహ్మ

సృజన శక్తుల కన్న
వీర యోధుడు నరుని
వర పశుపతము కన్న
అగ్ని భట్టారకుని
అగ్ని జ్వాలల కన్న
మధ్యాహ్న మార్తాండు
మహితకరముల కన్న
'అమవస' నిసినాటి
ఆకాశ వీధిలో
కాలమేఘాచ్ఛద
నల భీకరము కన్న
జలధర తిరోధాన
ములశబ్దముల కన్న
ప్రళయ కాల పురుద్రు
ప్రళయాట్ట హాసమును
ప్రళయ కాలపుసంద్రి
ములరావముల కన్న
క్షత్రియుల సంహార
వ్రతదీక్ష గైకొన్న
పరశురాముని క్రోధ

పుంజర్యాలకు మిన్న
క్రోధోజ్వలుండైన
రోషానలుండైన
ఘనుని దూర్వాసు
ఘనమైన శాపముకన్న
వాతాపి ఆగస్త్యు
వలన ప్రాణము పీడ
ఇల్వలుడు వెరగంది
నేల కూలిన యట్లు
విశ్వ జనావళికి
విస్మయము జనియింప
నిశ్చలుండైయతడు
స్వచ్ఛమౌతల ముందు
నిచ్చలును యెడ తెగక
ఆచరింపగ తపము
ఘోరాజి మడిసి క్రూ
శ్మైన జంతువులమూక
బట్టి భుజియింప సమ
కట్టుమానిసి చంద
మునుగాంచ భీతి జని

యించినట్టుల మనకు
గోచరించను అతని
ఘోరమౌయా కృతులు
గాఢమౌవన వృతు
నీడ లెల్లెడ నుండ
ఘనభుజంగములు అ
న్యోన్యమై చరియించి
దిక్కులెల్లెడల తమ
దృక్కులను సారించి
'బుస్సు' మనురావమున
విస్మయము కల్గించు
సింహ శరభమ్ములా
శార్దూలవరాహాముల
గజయూథముల శబ్ద
ఘీంకృతులు నల్దెసల
ప్రసరింప వనమెల్ల
విషమమై వెలుగొందె.
దివ్యమౌతపము నం
దవ్యయుండైనతడు
ఆహారనిద్రాదు

లనుమాని రేబవలు
మనసు ఈశ్వరుని పై
మరలించి తపియించ
తరువు లెల్లను నిశ్చ
లముగ నిలచియునుండె !
జంతుసంచారమా
వంతైన లేకుండె !
సూర్య చంద్రాదులా
సూర్య వంశజుతపము
గాంచిభయమున నిలచి
కదలజాలగనైరి
రత్నాకరుడు తనదు
ప్రతిభ వీడియుభువిన
రాజర్షి తపము స
వ్యాజమౌ చూపుతో
చూచి నిశ్చలు డయ్యె
వేచి-తత్తపముననె
విజృంభణము జేసి
విశ్వ ప్రళయము జేసె
భూనభోంతరములను

భేదభావము లేక

ప్రళయు మేతెంచెఘుడి

యుల కాలమందునసె

భువివడకె తత్కంప

భయమునను ప్రజలెల్ల

భీతాహులై దివికి

పరుపులెత్తుచు చనిరి

దివి వరకు తపస్సు జ్వా

లావరోధము లేక

పరిజ్వలించెను లోక

విజృంభణము దలచి

ఘోరమౌనా తపము

ఘోరమూ దేవికే

భరియింపరాకుండె

బాధనోర్వగ లేక

ఒక్కమారె సంచలనము

నిక్కముగా కలిగె భువిన

అక్కజముగనతని తపము

కెక్కడ సాటయె లేదుగ!

రాజర్షి తపమునకు

రాజర్షి ప్రతిభలకు
సాటి లేదిల నెట్టె
మేటిమౌనుల తపము
మేటిధీరుల తపము
మేటిశూరుల తపము.



# 2

ప్రాగ్దిశా కాశ సం
పదసప్తవర్ణంబు
లోకమూరు కమాలాప్త
మకుటమై వెలయంగ
నిద్రాణమైయున్న
నిఖిల లోకము లెల్ల
చలియించి మేల్కొనుచు
చక్క లేచిన యట్లు
కల గన్న మత్తకరి
కట్టెదుట సింహాంబు
గాంచి ప్రాణమ్ములను
గోల్పోయినట్టులా
రాక్షసాధిపుల దౌ
ర్జన్యమ్ము దలపోసి
భీకర జ్వాల ఘూం
ఘూంకరమ్మౌ విష్ణు
చక్రాయుధము వెడల
తత్కాంతి వీక్షించి
దానవేంద్రుల పంచ

ప్రాణములుఎగిసినటు
గాధినందను తప ను
గాఢమౌ లోకమున
బాధగూర్చెను లోకు
లాధరిత్రిని పిడి
దివిజేర నుంకించ
దేవలోకము వరకు
తపపు జ్వాలలు రేగ
తపపు ఛాయలుపేగ

× ×

తపో మహిమవలనజ్వాల
లాప్రాంతము వెలువడంగ
జంతుజీవకోటి యిప్పుడు
శాంతి లేక సంచరించె
చిచ్చురేకెను సర్వపుష్మ్ములు
నిలుచు భాగ్య మబ్బ లేక
జంతుకోటి ప్రాణ భీతి
చెంది పలాయనము చేసె
భూమ్యాకాశముల తార
తమ్యమ్మది లేక వాయు

సంచలనము కల్గి ప్రళయ
సముపార్జన జేసె నపుడు
మునిసత్తము లెల్ల తపము
మాని దివికి పరువు లెత్తి
దేవేంద్రుని గాన లేక
ద్వారము కడ నిలిచి యుండ
వియత్తలమ్ము నూత్న
విన్యాసము గావించెను
ప్రమదాది గణమ్ము లెల్ల
ప్రస్తుతించి రాతనమున
నిర్జరాధి నాథుడపుడు
నిశ్చలుడై నిలిచి యుండె
దిక్పాలకు లెల్ల నతసి
పాదపాలనకై నిలిచిరి.
అమరావతి నాథుడచలు
డై మనమున భీతిసంది
నిశ్శబ్దనిమీలిత నయ
నమ్ముల వీక్షించుచుండ
నారదుడే తెంచె నపుడు
నారాయణ యని బలుకుచు

దేవేంద్రుండతని పేర
దీవన లెస్స యొసఁగె సెను
అంతటగిరి వైరి అతని
కొంత వరకు స్తుతి యించుచు
ప్రళయమ్మా సన్నసుగుట
కిల కారణ మేమిటనిన
నారదుండు నగు మోమున
నాకవాసులకు దెల్పెను

## నారదుడు

సురలార! వినుడ వి
శ్వామిత్ర ఋషివరుడు
రాజర్షియై మదిని
రేబవలు చింతించి
ఘోరతపమ్మొనరి
ఘోరాటవుల యందు
బ్రహ్మర్షి భావమ్ము
బడయగోరి తపమ్ము
గావించుచున్నాడు
ఘనుడు నిశ్చలుడయ్యు

ఆ మహామహుని తప
మూ మహానుభావు చరిత
ఆ మహోగ్ర దీక్ష
ఏ మహా తాపసికి
ఈ పృథ్విని సాటియే!
ఈ పుడమి సాధ్యమే!

× ×

చంచల తపో నిష్ఠుల
చంచలు లై పోరెక్కువిని
అతని తపో మహిమ నేడు
గణి కై గీతించుచుండె
నిద్రాహారముల మాని
బుద్ధి శివుని పైన నిలిపి
మహా మహుడు నా తపస్వి
మహోభీష్ట సిద్ధి దలచి
తపియించుచున్నవాడ
తండుహిమాలయ నగమున

× ×

అతని తపో జ్వాల
అందాలరాశియై

నవ యౌవనానంద
నాకమ్ము నంజేరి
యౌవనాంకుర భావ
మవ్యయమ్మై వెలుగ
నిత్యమాత్మమ్ముగ
నొప్పారుచున్న దిల
బాల్యమ్ము వీడి నవ
భావనల జేరంగ
తపము వన్నెకురాగ
తరుణియై వెలుగొందె.

× ×

తపోశక్తివలన వృద్ధి
తపియించుచు గతినివీడ
నిశ్చలముగ నిలిచియుండ
నిట్టి ప్రళయ మువ్వెత్తై
సప్తసంద్రముల ప్రళయము
సప్తఋషుల చంచలమ్ము
సప్తాశ్వుడు పయనించెడి
సప్తతేజస్యందనమ్ము

× ×

మన్మథు మనోభావ
ములకు విశ్రాంతి నిది
కమ్మని కళా జీవి
కిమ్మహి నిశాదేవి
దిమ్మరుల కీ జగతి
దిక్కులేని పిశాచి
నిత్య సంధ్యా స్నాన
నిత్య జపహోమాల
నిత్యమౌ కాలమిది
సత్యమును దలపోయ. .
విశ్వామిత్రుని తపమ్ము
విశ్వక్షోభ రేపెనేడు
ఘనసమస్య ఉదయించెను
కనుగొనుడో త్రిదశులార
అఖిల చరాచరభూతము
లఖిలోర్వీజములు లోక
కంటకప్రాయమౌ మౌని
కటికతపమునన్మడసెను
వసిష్ఠుండు సన్మౌనిన
వ్యాజమౌ ప్రేమజ్వాల

విశ్వామిత్రుడు నాతని
విశ్వాసము నమ్మ లేక
పంతగించి పరితపించి
పటుతరముగతపిసియయ్యె

× ×

అమ్మౌని తపమున
నిమ్మహిలోగల
గిరులు చలించెను
శిలలు ద్రవించెను
మహీజమ్ములా
కాశము నంటెను
వనములు వడకెను
మనములు క్రుంగెను
మధు మాధుర్యము
మత్తైపోయెను
ఎడారి బీడారు
తెల్ల నశించెను
ముదావహమ్మది
మదిలో నసునసెను
సుమసౌరభములు

భ్రమరాంగనలకు
విషవాయువు వలె
వింతగ దోచెను
తేజవరాండ్రకు
తేజాప్రియమ్మున
యౌవన ఘడియలు
యౌవన ఋతుపున
ఆడవిన గాచిన
అందని వెన్నెల
వలె నయ్యెను తరు
ణులదుర్దశనిది.
మన్మథు శరముల
మధుగానమ్ములు
కోయిల కూసెడి
తీయనినాదము
శుక పికముల సు
స్నిగ్ధాలాపన
కవి హృదయమ్మున
కలిగెడి భావన
కనజాలము కద !

వినజాలము కద!
అప్సర కామిని
అందము తరగెను
గంధర్వాంగన
కనుగడ చెదరెను
వింధ్యాద్రులకడ
సంధ్యాకాంతులు
విషాద మయమున
వినాశ మందెను.
గాడ్పు చలించుచు
గగనము గప్పెను
జల ధరములు నగ
ములవలె కూడెను
పృథ్వివడంకెను
జలధులు నింకెను
జల జంతువులవి
జలమున మడిసెను
వనజీవమ్ములు
వనములమడిసెను
మానవతతి భువి

మారణ మందెను
ఆతరుణమ్మున
భూతల మందున
ఊహాతీతము
హాహారావము.
తారలు ఆకస
పారావారము
నందుండియు నా
నందం బందక
ఖిన్నాంగముతో
మిన్నంటియు నిజ
కాంతుల మానియు
శాంతుని గానక
ఆవేశమ్మది
ఆవహింపనట
ప్రళయాంకురమై
ప్రజ్వలించినది.
పావకుడాయా
ప్రాంతములను తగ
పావన మొనరిచి

పరితృప్తుండై
మునిశక్తికినా
ముని తపమున దా
శ్చర్యమునందుచు
నిశ్చలుడయ్యెను.
జగతిన ప్రత్యక్ష
మున కల్గిన దిక
జగతికి సద్గతి
ఏగతి కల్గునో?
దేవేంద్రా! ఈ ప్రళయము
దేవలోకమునకె! గాద
సర్వజగత్తుకు సంకట
మైరూపొందను తెలియుము
ఇట్టి ప్రళయ తాండవమ్ము
నెట్టుల సరకట్టుదపో
కట్టెదురుగ కలదు మహో
గ్రమహోన్నామౌని తపము
భారము నీయది లోకపు
భారమ్మును దీర్ప వేగ
విశ్వామిత్రుని తపమును

శాశ్వతముగ చాలింపుము.
అనగా విని సురనాధుడు
అమర ముఖ్యులను దోడ్కొని
సంభాషణ చేయ గోరి
సభ చాలించెను నప్పుడు,



# 3

ఇంద్రాగ్ని యమవరుణ
బృందమ్ము యోచించి
విషయమేమిటో తెలియ
నాశించె నాక్షణము
వరుణుండుయముడును
వరుసగాప్రతినగొని
మునితపము మాన్పఁగ
త్నింతుమనితలలూప
అగ్నిభట్టారకుడు
ఆవేశపరుడయ్యె
నేనె యాముని తపము
మాన్పింతునని బలుఁక
ఇంద్రుండు వారించి
ఇట్లు బలికెనునపుడు
'మనవలనగానిపని
మనసుసేయగరాదు
ముని తపోభంగంబు
ఘనమైనకార్యంబు
కార్య సాధనకు నే

కనుగొందుమార్గంబు.'

× ×

కరుణార్ద్ర భావసం
కీర్ణమైనట్టి అ
ప్సరకామినీ గణము
సురనాథు తలపులో
ఒక్కమారెదురయ్యె
ఒక్కనిముసములోన
రంభా తిలోత్తమలు
స్తంభించి రాతుణము
ఊర్వశికి ప్రభు తలపు
ఉత్పాత లూగించె
గంధర్వ యక్షకిన్నర
కాంతలాకృతులు
వర్ణ వర్ణమ్మాయె
వలపులకు లోనయ్యె!

× ×

ఊర్వశి నాట్యము
పారంబయ్యెను
రంభాద్యప్సర

బింబాధరులకు
వలపులు కలిగెను
తలపులు రేగెను
సంధ్యా కాంతుల
అందము మించెను
నందన వన శ్రీ
మంతినిజనములు
అందమ్మున్నసనా
సందర్శించుచు
వన విహారమ్మున
మనములు మురిసిరి.
కుసుమాంగనలకు
కుముదమ్ములకును
చంద్రుని ఆగను
నమ్మిన సమ్మతి
కల్గెను ప్రాప్తిన
కమ్మని ఆశలు
కల్గిన యట్టులు
కల్గెను నారికి,
వలపులు మనమున

కలతలు రేపెను
ఉత్తుంగస్తన
యుగ్మము కదలెను
మధుయౌవనమది
మమతల రేపెను
దివ్యాంగనలకు
దివినాధుని తల
పవ్యాజమ్మగు
ఆశల జూపెను.
మదిరా పానము
మత్తున నప్పుడు
విరహిణులగునా
సుర కన్యల పతు
లతి సంభ్రమమున
సతులను కన్గొన
ఆ దివ్యాంగన
లాదివ్యాకృతు
లాదిత్యుని వలె
హృదయకుహరమున
ఆశా సౌధపు

ఆశ పిశాచము
పలె గన్పట్టెను
ఇల విచిత్రమిది.

× ×

రంభాది యప్సరలు
రంగ స్థలము చేరి
నృపుతలపు మదిదలచి
నృత్యమ్ము గావించ
అప్సరో-కామినుల
కందరకు మిన్నయై
నిత్య నూతనపుయౌవ
నమ్మున వెలుగొందు
మేనకా కాంత తన
మేను దెలియకనపుడు
అడుగులలో పడుగేసి
ఆడ మొదలిడె నచట

× ×

మేనక అందము
కానగ చందము
విందుమె! పృథ్వివ

కందుమె! జగతిన
ఆయప్సర కా
మిని కాయమ్మున
గలసర్వావయవ
ములలావణ్యము
ఏమది రాశికి
ఈ లోకమ్మున
కలదా! లేదా
కలుగ దటంచును
అను మానమ్మది
ఆవిర్భవముగు
సప్త స్వరముల
గుప్త రావములు
అవయవ పరిధుల
నవలో కింపక
నాట్యము చేసెను
నవమోహిని యట
తరువులు పశులు
తలలాడించెను
కరముల చతురత

విరహుల కింపగు
చంచల దృక్కులు
కాంచని తరమగు
కురుల సోయగము
మరులను గొల్పను
ఆ మేనక తన
అందమ్మేన కదు
సంచలనము క
ల్గించెను స్వర్గము.
ఆయమ అందము
మాయని చందము
మాయని మాయని
పుష్పసుగంధము
మేనక నాట్యము
మేనక గానము.
అప్సర కాంతను
లందర కాతరు
లమ్మేన ఈర్ష్యను
ఇమ్ముగ నిచ్చెను.
ఆయమ ఆడుచు

ఆసమ యమ్మున్న
రాగా లాపన
చేయగ మెదలిడె
"నందనవన కుసుమమ్ములు
సుందరమౌ సౌరభముల
సర్వజగత్తున ప్రతిభను
శాశ్వతముగ చాటుచుండ
ఆనందాంబుధుల దేలి
అనురాగమయ ప్రపంచ
సౌధాగ్రము నందు నిల్చి
చాటుచుందు నా గీతము
నాగీతా లాపనలో
వాగ్దేవీ వలపుచింద
భావిభగ్న జీవుల స
త్వత్వమ్మును కాపాడుదు.
శృంగారమయ ప్రపంచ
భృంగగానమజరమ్మై
నాగీతాలాపన కోక
నవ్యాకృతిని సృష్టించును.
నాగీతి విలాస వల్లి

నాగీతి ఫలాశమల్లి
నవచైతన్యమ్ము గల్గి"
వనలు నెపుడు నీ ప్రార్థన
అనియా మేనక
వినసొంపగునటు
గీతా లాపన
గావింపగ త
త్తరుణమ్ముననా
త్రిదశాధీశుడు
ప్రత్యక్షించెను
పంకజాక్షులకు
కామిని బృందము
కడు గారవమున
అక్షణ మందున
అంజలి మోడ్చెను.

× ×

వాసవుడు తన దేవ
తాసనము దలపోసి
అప్సరోంగనలలో
అందకత్తియ మేన

కానతినిదరి చీరి
పసతికి లేని సౌం
దర్యమ్ము నీ కబ్బె
దరిజేర్చు మిక నన్ను
తరుణి! నీ దగు శక్తి
తరుణి! నీ దగుయుక్తి
అని దీన వదనుడై
గాన్పించు రేనితో
వినయమ్ము సంభ్రమ
మ్మును గలుగ నిట్లనియె

## మేనక

లోకాధిప ! నాకము నీయదికద!
లోకేశ్వర ! నే నీదాననుగద!
పని యేమిటి ? సురనాథా! దేవా
పన్నుగ దెల్పుము ! పావనచరిత!

## ఇంద్రుడు

మేనకా! నీయంద
మేసతికి రాబోదు

నీ యుక్తి నీ శక్తి
నీమనో భావనలు
ఏ మహాత్ములకైన
ఈ స్పర్థ్వి మారపించ,
కలదొక్క కార్యంబు
ఘనతరంబౌదాని
నెరవేర్చి స్వర్గమా
పరువు దక్కించుమిక!
ఘనుడు విశ్వామిత్రు
డనుపమముగ తపియింప
ఆవిర్భవించె ప్రళ
యావహా మైత్మ భువిని
ఏ రీతి నైన ముని
మరులు గొనునట్లునీ
చాకచక్యము జూపి
సాధించు కార్యంబు

## మేనక

దిక్పాలకులు ఋషులు
దివ్య మహిమాన్వితులు

త్రిదశాధి పులుమీరు
త్రిజగమ్ములుసు గిరులు
వనములును క్షేత్రములు
వారధులు జలధులును
బ్రహ్మాది దేవతలు
బ్రహ్మాండ నాయకులు
ప్రమథాది గణములును
పరితాప మొందరే !
ఆమౌని ధరిదాపు
ఏమహా పురుషులును
పోజాల రేరుకద !
పోదునెటు వతనిదరి?

× ×

అమ్మౌని యల్గిన
నిమ్మహిలోగల
గాడ్పు చలింపదు
గమనము గల్గదు
జలధులు నింకును
తలమది చెదరును
గగనము కదలును
గిరులు వ్రయ్యలగు

సృష్టికి భువి ప్రతి
సృష్టిని చేసిన
తపోనిష్ఠలో
తన్మయుడగు నా
తని కడ కేగిన
మనజాలుదునే !
నన్నాభీకర
ముని కడ కేగెడి
పనికై పొమ్మన
తగునా! దేవర
దాసిని బ్రోవుము
ఘోనను నాయెా
పినకోలదిని నా
తని తపమును భం
గము సేయుగ నే
యత్నింతును దే
వాసెల విమ్మన
ఇంద్రుండు దీవించి
ఐరావతము నెక్కి
అరిగె తనసదనమ్ము
అరనిముస మందుననె.

# 4

ప్రభు కార్య నిర్వహణ
పడతి మేనక దలచి
జాగు సేయక నపుడు
పగుదెంచెను భువికి
తన తోడుగా మంద
మలయా నిలుని గొనియు
ఏతెంచె నాతన్వి
ప్రీతి హైమహిమ నగము
శక్తి యుక్తుండైన
ముక్తి కాముకుడైన
ఘనుని విశ్వామిత్రు
ఘన తపోవనమునకు
అరుదెంచె అప్సరస
అందాల ప్రోవియై.

× ×

సుందరమౌ అంగమ్ముల
సురలమన్ననలు వడసిన
అందకత్తె మేనకమది
కనుమానముతోచిన దట.

మునినాథునే రీతి
కనుగొనగ వలయునో
కనుగొన్న నే రీతి
కరుణ పొందగ వలయు
కరుణ పొందిన మనసు
కరగింప శక్యమా!
కాఠిన్య మానసిని
కఠిన నిష్ఠా పరుని
కోపించు తాపసిని
కోరి ప్రేమించునటు
ప్రేమించి కామించి
ప్రియురాలినై యతని
తపము చాలింపనా
తరమె! చాలను నేను
తరమె ! చానను నేను
ఐన దిక్కి నాథుకో
పానలమ్ముున మడిసి
సాటి కామినులలో
మేటి తనమును మాసి
ఏ రీతి మన గలను ?

ఏది నాకిక దిక్కు
తనకు తోడు వసంతుండు
తరలి వచ్చినాడు శుభము
కల్గును నాకేల? చింత
కలుగ బోదునే యాపద"
అనిదలచియు నా మేనక
ముని శక్తికి చోద్య మంది
తపోవనము చేరబోయి
తిలకించెను నా ప్రాంతము
తపః ప్రభావమున వనాం
తర శక్తులు చల్లారెను
తపోజ్వాలలోన బంధి
తులు నై రాముని వర్యులు
తపోవనము తపః శక్తి
తపోజ్వాల తపః ఫలము
తపోరాశి తపోధర్మ
మపారమ స్మగా నుండెను.
కామ క్రోధ మోహ లోభ
మద మాత్సర్యముల వీడి
నిష్కామ విరాగి మనో

నిశ్చయమున తపము సేయు
విశ్వామిత్రుని తపమున
విశ్వాసము కల్గి తన్గి
నిశ్చలుడౌముని వర్యుని
నిష్టను పరికించుచుండె.
స్వచ్ఛజ్యోత్స్నలు చిందుచు
నిశ్చలుడై యుండు మౌని
పద్మాసనుడై తపమున
పారవశ్యతను పొందెను
తపోమహిమ వలన దివ్య
తేజమ్మును దాల్చియతడు
సత్పురుషుల నయనమ్ముల
సదమలమౌ భావమ్ముల
కుటిలహృదయులనయనమ్ముల
పటుతర గాంభీర్యమ్ముగ
గోచరించు నామౌనికి
గుణ పాఠము నేర్పెదనని
మేనక నాతని డాయఁగ
మనసు నొప్పలేకనపుడు
మునికి దండ మాచరించి

క్షనుగానెనటు పుష్పవనము.

× ×

మేనక తన సతుల గూడి
కాననమున విహరించుచు
నాట్యమ్మున తన్మయత్వ
నాక సుఖము ననుభవించె

× ×

కనజాలని
వినజాలని
కఠిన తపము
గావించెడి
మునివర్యుని
ఘన తపస్సు
భంగ పరచు
భంగిమలకు
దివి నాధుడు
దిగ్భ్రిమతో
నింగి యందు
నిలచి యుండి
వలపించుచు

తలపించుచు
తిలకించెను.
ముఱపించెను

× ×

వలపుల భామిని
కలనాదమ్మున
కరుణామయి నా
కమువలె వనమున
విహార మొనరిచి
మహోత్సాహమున
మై మరపించెను
మై వలపించెను.
వలపుల చూపులు
తలపుల రేపెను
నాట్య వైభవము
నాకము మించెను
నభో స్థలమ్మున
శుభోదయమ్మయె
నవనవ లాడెడు
నవ యౌవనమున

నవరసమ్ముగలను
నవరాగమ్ముల
నవచైతన్యపు
నవోజ్వలమ్మున
మేనక పాడెను
మేనక ఆడెను.
సఖులను గూడియు
సంతస మలరగ
సంచరించె నా
సుమ వనాంతరము.
కమనీయమ్మగు
సుమ సౌరభములు
కమ్మని మధుస్వన
మున్మహా గీతము
తెలియని స్థాయిని
తెలియని హాయిని
ఊహాల కందని
ఉజ్వల రూపము.
మహిమాన్వితమౌ
మానిని కాయము

మానవ శక్తులు
కానని రూపము
మారియని తీయని
సోయగమున నా
మేనక వనమున
మమతలు రేపెను.
తేజోమయు డగు
తాపసి మనమున
వలపుల జూపెను
కలతలు రేపెను.
మేనక చర్యలు
కానగనటు గల
తాపసి బృందము
తన్మయ మందెను.
కౌశి కుడాయ్యూ
కాలములకు విధి
వేరితమున తన
ప్రతిభనుమాపెను
కన్నులు తెరచెను
కన్నులు మూసెను

మూయుచు తెరచుచు
ముగ్ధుం డయ్యెను
మనమున కామము
మరివెన్నాడెను
అంతః శక్తులు
ఆపెను చర్యలు
కామముతోడుగ
క్రోధముకదలెను
మోహము వెడలెను
మోహిని వేటకు.

× ×

ఆకొన్న సింహంబు
ఆహారమును గాంచి
అప్రయత్నముగానే
అలగి లంఘించు విధ
మా మహాఋషి క్షణము
లో మేనకను జూచి
మరులు గొనె మోహమున
మమతలకు లోనయ్యె.

## 5

జడదారి చపల
చిత్తమునందు తపమును
చాలించి అపుడు
చనెమేనకాసతి కడకు
తనరూపు తనచూపు
తనయుక్తు లన్నిటని
మానిమేనక మదిని
ముదమందె నాక్షణము.
పైట సవరించు కొని
పసిడి ఛాయల చాన
నిట్టూర్పు నిగిడించి
నిలచె కౌశికు ముందు
సురనాథ యోధులకు
సులభమ్ము గాని పని
గావించి నాననుచు
గర్వించె తత్క్షణము
మునివర్యు నొకమారు
కనియె వాల్గనులతో
అతని తేజోరాశి

ఆమె మెయి మరపించె
మనసులో మసలినవి
మధురభావాలెన్నొ
తనువు పులకిత మయ్యె
తరుణి అందము మీరె
కౌశికుండంత యో
చించి పలికెను నిట్టుప

## విశ్వామిత్రుడు

వాల్గనుల సొంపులో
వనజోత్స్న వై వెలుగు
మధుమాను భూతి స
మ్మోదవతివి మేనకా
హృదయము మధురపుతలుకు
ఉదయింప నా మనసు
చలియింప నినుగాంచి
చపల చిత్తుడ నైతి
సుమబాణము
లనేకములుగ
శంబరారి

సంధింపగ

నామనమున

నీ రూపము

నవ్యసృష్టి

సృష్టించెను !

నవజ్యోతుల

వెలిగించెను!

ఓ మేనక

నా మేనక

ఓర్వజాల

నోర్వజాల

ఓ మేనక

నా మేనక.

## మేనక

తపో నిష్టమూన నీకు
తగువా! ఇటు మునివర్యా!
తరుణి వయో రాశి గాంచ
తలపు గలిగె ! ధర్మంపే
గాధిపుత్ర విమల చరిత
కౌశికా మహాత్మ హో!

లోక రక్ష లోక సృష్టి
లోకవిదితమా! ఇది
తగదు దేవ తలపుమాని
తపము సేయగడగు మీ
వనసీమల విహరించెడి
వనజాక్షుల గాంచగనే
వలపుమీరు. మునివర్యుల
కలలు దివాస్వప్నములగు
ఇది యేమిటి? గాధిసుతా
ఇది యేమిది! ఘోరమా
కామిని గన్పట్టగానె
కామము జనియించునా?
తపోశక్తి గల మీకిది
తగునా ఇది! ధర్మమా
చాలింపుడి సరసమ్ములు
పాలింపుడు బ్రహ్మచర్య.

## విశ్వామిత్రుడు

స్వర్గమ్ము ్రపిడి ఈ
మార్గమ్ము నే తెంచ

కారణం బేమిచే
కమలదళనేత్రీ!
నా యోగమహిమ వల
నన్నేనుకనుగొంటి
అమరేశ్వరుడు నిన్ను
అంపె నాదరి చూడు.
ముక్తిమార్గమ్ములో
శక్తియుక్తుడనైన
నన్నువంచింపనీ
పన్నుగడపన్నితివి.
కనుగొంటినో తరుణి
కనజాల లేనెందు
నీయట్టి ఎలనాగ
నీయట్టిమదిరాక్షి
అవిరించికి తెలియు
దీవిఖిలజగత్తు
లోనిట్టి అందమో
లోలాక్షి కలదంచు
ఎరిగి యున్నను లాభ
మేమచే! మేనకా!

ఎదలోని భావాల
కెరయయ్యె నీ ప్రతిభ,
బిగి కౌగిటి నన్ను
బంధింపవే పడతి.
చాలించు నీయాట
సాగదిక నాముందు
నరసీరు హాస్తిరో
సమయ మేతెంచినది
మదనుని శరమ్ములవి,
మరినన్ను వెన్నాడె
తాళజాలను సుంత
ఆలసింపకు సుమ్మి
రమ్ము నాదరి జేరి
రమణి ముద్దుల నిమ్ము
రతి క్రీడలం దేలి
రతిసుఖమ్ముల గ్రోలి
రాణింపవే, నన్ను
రాణింప జేయవే
అనుచు విశ్వామిత్రు
డరుదెంచి మేనకను

బాహుబంధాలలో
బంధించి మురిపించె
కోపమ్ము నటియించి
తాపమ్ము ప్రకటించి
ప్రీతి లేనట్టు లా
నాతి నటియించె నటు
మదన బాణ పరంప
రోదయమ్మై వాని
హృదయ తాపమ్ములను
హృదయ శల్యమ్ములను
పోగొట్టి అకళంక
ప్రేమ జాలము చేసె!
దివ్యతేజో రాశి
అవ్యయుడు కౌశికుం
డామహాత్ముడు నేడు
కామసుఖ లాలసుడు
మేనకాప్సర కన్య
యే అతని దైవమ్ము
ఆమెయే అతని తప
మామెయే అతని గతి

ఆమెయే అతని స
ర్వస్వమ్ము ఆయ మే !
ఆమెయే ! ఆమెయే !
అందాల రాశియై
అందాల రాశియై
ఆకాశ తారయై
కాన్పించె యాతన్కి
గాధిసుతు నయనాల
గాధిసుతు హృదయాన
గాధినందను మోలి

× ×

భోగసుఖమ్ముల దేలుచు
భాగ్యరాశియా మేనక
విశ్వామిత్రుని తపమున
విప్లవమ్ము రేపి యతని
తపోశక్తి నణచివైచి
తపోమహిమ సడలించెను
తపోభంగ మొనరించెను
తపోభంగమొనరించెను.

× ×